Reg No.757.

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక
అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము ౮ | 1916సం॥ నవంబరు. | సంచిక 11

విషయసూచిక.





చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 2 0 0 |

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and published at Jaapadu, bythe Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

2 రాజా బెల్లపురవల రాఘవేంద్రరావు బహద్దూర్,
జాగిరిదారుగారు,నవాబుపేట.

## పోషకులు.

1 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునసబు, నిమ్మబ్రోలు.

2 రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహాదరు
జమీందారులు, నూజవీడు.

3 రామసింగుగారు నెల్లుట్ల వాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల.

4 రాజా వెంకటాద్రిఅప్పారావుబహాదరుజమీందారుగారు, నూజవీడు.

5 రాజా వాసిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరుమున్నేసుల్తాన్
జమీందారుగారు, ముక్త్యాల.

6 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి.

7 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు.

8 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోల్లేరు.

9 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట.

10 గూడూరు సాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు.

## సహాయులు.

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజంపాడు.

2 చిప్పగిల అప్పయ్యశాస్త్రిగారు, సికిందరాబాదు

3 వెలుగూరి పిచ్చయ్యగారు కొదమగుండ్ల

4 కాసమా హనుమయ్యగారు నర్సారావుపేట.

5 తోర్లకొండ హనుమంతరెడ్డిగారు లోలంపగ్గరాసీగ్ దారు, యల్లారెడ్డిపల్లె.

6 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి.

7 వెదస శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

8 బాక రాజా పరాంకుశరావు దేశముఖుగారు, యాడవరము.

9 హాజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ.

10 నరసింహారెడ్డి దేశాయిగారు, కాసగబాద.

11 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి.

12 నరసింహాచార్యులుగారు-పట్వారీ-కొలనుపల్లి.

13 పిల్లలమర్రిసోమరాజులుగారు, తహసీలుదారు నరసారావుపేట.

14 ఉకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమిదీపురం

15 ఉల్లగంటివీరరాఘవరావుగారు, ముక్తాదారు, ఆనేపురం

16 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి.

గతిజలసేతునిబంధన
మతిపెట్టినయట్లుగాదె మహనీయమతీ!

కం॥ కనలేదా మును పెవ్వరు, వినలేదా కొన్నినాళ్ళు మహిపడివారల్
చనలేదా స్వర్గమునకు। వినలేదా గ్రంథములనువిమలగుణాఢ్యా!

10—10—06 ... బొడ్డుచెర్ల రామకృష్ణయ్య ...
కండ్లకుంట.

ఇట్టియభిదింపు లనేకములు. ఇట్లభినందించుటకయియె
శ్రీ తిరుపతి వెంకటేశ్వరకవులు జానపాటికివచ్చినప్పుడుచదువఁ
బడిన పద్యములు

చ॥ తిరుపతి వెంకటేశకవిధీరులఁజూచి భజించుభాగ్య మె
ప్పరుసునఁగల్గునో యనుచు భావమునం దలపోయుచుండఁగా
హరికరుణావిశేషమున హర్షమెలర్పఁగఁ జూచుటాయె నో
వరమతులార! నేఁడు కదఁ బావితముల్గద మాదుజన్మముల్॥

శా॥ ఎందో యుండినమీర లిచ్చటికి దయ్యెం బారు మాయూరికే
తెంచారం చని దంతురించు మతిలోఁ బాలించి విచారింప నా
నందుండౌను "మదాత్మజాతునకు గా వాఁడిందురప్పింతు న
న్పందుల్కం" డని మమ్ముఁగూర్చియనె నీపట్టాభిరాముం డహా!॥

కం॥ ఎవ్వనియుపనయనమునకు
నవ్వారిగ మిమ్ముఁ గనుమని తలఁచితిమో
యవ్వాని వృత్తికేఁ గంటిమి
యిప్విధమునమిమ్ము నోకవీశ్వరులారా!॥

ఆ॥ తలఁపఁ దావకీనదర్శనానందంబె। కాని మాకుఁ బ్రకృతకాలమందు
ఇతరమార్గ మొక్క యింతయుంగనుపట్టు। దేమిచేయవచ్చు నీశ్వరాజ్ఞ॥

మ॥ వరవిద్వత్కవులార! శ్రీవారి దయన్ బట్టాభిరామాఖ్యధీ
వరుసింబ్రతియుతుంబొనర్చి ప్రదుతి మమ్మార్చియుప్రస్తోత్సవం
బు రహింజూడఁగఁగూర్చిమిమ్ములను నామోదంబు యుష్మద్వచ
స్సరణిన్ మాకిఁకఁగాక చూపఁటయదంచద్భక్తి సేవింపఁగన్॥

పప్పూరిసీతారామశాస్త్రి.

వ॥ అట్టిసన్ను జగద్గురు ననాదిపురుషు ననన్యసామాన్యప్రభావోదయు నవాఙ్మానసగోచరు నద్వితీయు నేమును గూడిన భువనత్రయనాథులును సులభంబుగా సందర్శించి సంభాషణ సంశ్రవణ విలాసంబు లొందంగంటిమి, కృతార్థులమైతి” మనిపలికి శంతనునిజూచి యిట్లనిరి॥ 338

ఉ॥ “శంతనుసార్వభౌమ! నృపసత్తమ! నీదపుభాగ్యమెన్న న
త్యంతము, శ్రీరమాధిపతి యల్లుఁడటంచుఁ బ్రసాదభాసిత
స్వాంతముతోఁ గనుంగొనఁగఁజాలితి వ్రాలితి కీర్తివల్లికా
శాంతసమాశ్రితాఖిలదిశాతలయాతుఁడవై మహోన్నతిన్” 339

వ॥ అనిపలికి యాశీర్వదించి వీడ్కొని వారిచేత నామంత్రణంబువడసి స్వేచ్ఛంజనిరి, హరియును దత్పుటభేదనంబు జామాతృభుజాదండపరిపాలితంబుగాభావించి సురేశ్వర రత్నాకరేశ్వరులఁ దక్కిన సురగరుడగంధర్వసిద్ధవిద్యాధరుల వీడ్కొల్పి తానును వైకుంఠధామంబుప్రవేశించె,నటశంతనుండును సామంతసచివపురోహితబాంధవవరూధినీసమేతుండై వధూమణిందోడ్కొని చనిచని ముందట॥ 340

సీ॥ గురుమౌక్తికోదారతర రంగవల్లికా
సంగతప్రతిగృహప్రాంగణంబు
గారుడోపల లసత్తోరణబద్ధాతి
సుందరద్వారాభిశోభితంబు
కర్పూరచందనాగరుధూపధూమసం
వాసితప్రాసాదభాసురంబు
భూరికాహాళశంఖ భేరీమృదంగాది
మంగళారావ సమన్వితంబు
ఘనచతుర్విధ శృంగారకలితలలిత
సుందరీజనబృంద సంస్తూయమాన
చారుఘంటాపథంబు భూజానియెదుట
కనుగొనియె నిజమగునట్టి గజపురంబు॥ 341

క॥ శుభలగ్నంబున మఘనాస్ని భుఁడగు భూజానిబంధునికరము మంత్రు
ల్ప్రభువుల్న లుదిక్కులగాఁ। విభ ప్రాన్న తిగేహమునఁ బ్రవేశించెఁదగన్

వ॥ ఇట్లు గృహప్రవేశంబుగావించి గృహదేవతారాధనంబొనర్చి జనయిత్రికి నమస్కరించి దీవనలు గైకొని బంధుమిత్రామాత్యాదుల సముచితసత్కారంబుల సంభావించి యంత నొక్క శుభదినంబున॥ 343

సీ॥ మణిమంటపంబున మదకీరశారిక
ల్పుష్పాస్త్రశాస్త్రార్థము లువదింప
నిద్దంపుబంగరు ముద్దుకీల్బొమ్మలు
సరసలీలలఁ బనుల్సంఘటింప
గంధవాహవిశేషగతులమించి విపంచి
తతులును రాగపద్ధతులువలుక
వజ్రమయస్తంభ పరమయూఖచ్ఛట
లేఁబగ ల్సాంద్రచంద్రికలనీన
పద్మరాగవితర్దికాబ్జమణికుట్టి
మేంద్రనీలకవాటక శ్రీవిలాస
సుందరంబైన కేళికామందిరంబు
కదియ నేతెంచె శంతనుక్ష్మావరుండు॥ 344

క॥ ఒకచోఁ కినలమఁచం (బొకచో దోమతెరమంచము యుయ్యలమంచం)
బొకచోఁజప్పరమంచం బొకచో నొప్పారిమిగులనొఱపు (వహింపన్)

సీ॥ దాసకన్యాంగసౌందర్యసంపదఁగాంచి
మరులు చెందిన పరాశరునివిధము
దారుకావని మౌనిదారలచిత్తము
ల్గరఁగంగఁజేయు శంకరునిజగ్గు
గౌతమపత్నితోఁ గలయుటకై చాలఁ
దమకమొందిన పురందరునిసొబగు
గురుభార్యతళుకుచెక్కులఁ గమ్మకస్తూరి
శతకల్పనము సేయు చంద్రునీవి

అల్ల రేపల్లె గొల్లయిల్లాండ్ర సతుల
చతురచాశీతిబంధసంగతుల రతులఁ
దేల్చుచుండెఁ గోపాలదేవుచర్య
యమరఁ జిత్రించినట్టి కుడ్యములఁ గాంచి
ప్రమద మొందుచునుండెను బ్రబలుఁడగుచు॥ 346

సీ॥ పగడంపుఁ దరిగోళ్లు నిగరాలమగరాల
పట్టెలు చీనిహొంబట్టుపట్టు
చొక్కపుటల్లిక సుందరచిత్రవ
స్త్రావృతంబైనట్టి హంసతూలి
యునమొప్పు పాన్పునఁ దనరారసించిన
రాజిల్లు చెంగల్వరాజిపిరులు
గనుపట్టి పైనొప్పు నునుచల్వవలిపెంబు
పచ్చాకునించిన పరిమళించు
తలగడయు జాళువాజలతారు తెరయు
మించి రమణీయమైనట్టి మంచముపయి
రాజచంద్రుఁ డుపవళింప రాజవదన
లంగనామణిఁ బతికడ కనుపఁ దలఁచి॥ 347

వ॥ కలువలచెలిమికానిం గలకలనగు ముద్దుమొగంబున మొల
కనవ్వు మెఱుంగు వెట్టఁ గంగం గదిసి యిట్లనిరి, 348

తే॥ "కన్నె! యిన్నాళ్లు పతిసమాగమము మదిని
గాంక్షితము సేతు, విదె నీకుఁ గలిగె నింక
రాత్రిఁ బగలును సురతతంత్రములఁ జొక్కి
మగఁడు నీవును సుఖలీల నెగడరమ్మ॥ 349

సీ॥ కమలాయతాక్షి నీ కాఠిన్యవక్షోజ
పర్వతంబు లురంబు పైఘటించి
తియని కెమ్మోవి తేటతేనియ లెల్ల
గురుతరవిస్ఫూర్తిఁ గొల్లలాడి

అతులితనవనఖరాయతాంకములను
బంధురక్షతములపాలుచేసి
బాహుళపాశంబుల బంధించి సద్గాఢ
బహుళకర్దమమునఁ బరఁగఁ ద్రోచి
"ఎంత చేసిన వారికి నంత కాదె"
యనెడువాక్యంబు ధర నిజమ్మైయొసంగఁ
బెలుచ వలపించి వెతలను బెట్టినట్టి
ప్రాణనాయకుఁ దగ భంగపఱుపవమ్మ॥ 350

తే॥ సర్వసర్వంసహానాథసంచయముల
ఖండనక్షోణులను గ్రింగుపఱచునట్టి
జీవితేశుని బైకొని చిత్తమలర
బాల!పుంభావరతిఁ గ్రుంగుపఱుపవమ్మ॥ 351

వ॥ అని మేలంపుమాటల లోలాక్షికిఁ గొంతప్రొద్దు ప్రియంబు
గఱపి మఱియు నిట్లనిరి॥ 352

సీ॥ "చంద్రాస్య!యిప్పుడె చక్కెరఁ బెట్టి రా
చిలుకకుఁ బద్యము ల్సెప్పవలెనె
విమలాంగి!యిప్పుడే వీణియధరియించి
సరసరాగంబు లేర్పఱుపవలెనె
ఎలనాగ!యిప్పుడే కలికి రాయంచకు
నేర్పుమీఱఁగ నడల్నేర్పవలెనె
మానిని ! యిపుడే మధురోక్తులొనఁగూర్చి
చిత్రకవిత్వంబు చెప్పవలెనె
జీవితేశుండు పడకిల్లుఁ జేరవచ్చి
మృదులపర్యంకమందున నెదురుసూడ
జాగుచేసెదవమ్మ లేజవ్వనంపు
సుందరులఁగంటి మిటులెందుఁ జూడమమ్మ"॥ 353

వ॥ అనిపలికి 354

తే॥ క్రొవ్వు క్రొవ్వారుచును జెలు ల్లోడితేఁగ
కన్యకామణి మందానుకలితలీల
మెల్లమెల్లన నడుచుచు మిగులనప్పు
డలసగామినియనుట దృశ్యంబు చేసి॥ 355

క॥ లలిత మణిపంజరమునకుఁ
జెలువమరఁగఁజొచ్చు చిలుక చేడియలీలన్
తలవంచి సిగ్గుతో ట్రేల
జలజాయతనేత్రి కేళిసదనముఁజొచ్చెన్॥ 356

వ॥ అప్పుడు

తే॥ సురటి తెచ్చెదనని యొకతుకఁ జూనెఁగె, గిండి
మఱచివచ్చితినని యొకతుకఁ జరిగె, మించు
టద్దమిదె తెత్తుననుచునొకర్తరిగె, చెలియ
లందఱిటు లేనినెపముల నరుగుటయును॥ 358

ఉ॥ చక్కరబొమ్మఁగాంచి ఘనసంభ్రమమోహము లుప్పతిల్లఁగాఁ
జక్కరవింటివాని సగు చక్కనిరాకొమరుండు నిద్దపున్
జెక్కుల తేఁతనవ్వొలయఁ జీరచెఱంగు గొంగిఁబట్టి పాన్పుపై
కక్కఱిమీఱ రాదిగిచి హారిసుధామృదుభాష నిట్లనెన్॥ 359

మ॥ "సరసీజాస్త్రమహోగ్రధాటి కెలమిన్ శంకించి నే నీదు బం
ధుర కాంతిస్వ్యవయోధరాచలమునందుర్గంబు లాపన్నతన్
శరణంబొందఁగఁ గోరినాఁడఁ గనుకన్ సంప్రీతి మన్నించి నీ
కరుణాపాంగములం గనుంగొని వెసం గావంగదే కోమలీ!॥ 360

సీ॥ కలకంఠపంచమకలకూజితస్ఫూర్తిన్
నలరు నీ కలికిపల్కులువినంగ
శర్కరాప్రతిమాన చారుమాధురిగల్గు
నీదు కెమ్మోవి తేనియలుగ్రోల
కల్యాణభూమిభృద్గౌరవోన్నతిఁ(దద్ద)
నొప్పు నీ వక్షోజయుగమునిమురు

విద్యుల్లతాస్నిగ్ధ విమలప్రభారూఢి
గలిగిన నీమేను గౌఁగిలింప
శ్రవణరసనాశయాంగము ల్జలదవేణి!
తమకమొందుచునున్నవి తత్తదుదిత
భాసురోదారసౌఖ్యసంపత్సమృద్ధి
సంఘటన వానికొనరింపఁజనదె నీకు॥ 361

తే॥ వరుస రతివేళ నీకచవదనగళము
లనెడినగనీలపద్మశంఖాప్తినాకు
సలరగల్గించి రాజరాజనెడిమాట
నిజముకావింపరాదె పంకజదళాక్షి! 362

ఆ॥ అస్తినాస్తిసంశయాపాదియై చిదం
బరరహస్యలీలఁబరఁగు నీదు
కలికికౌనుఁజూచుకాంతుఁ వేఁడెడినాకు
నీవియనఁగ వేలనీవుతరుణి!" 363

వ॥ అనినవియనురాగంబులుదోఁపఁ బలికి 364

సీ॥ తాంబూలరాగాధరంబుపై రదనాళి
యొత్తఁబోయిన మొగంబొనరఁజేయు
హాళి లతావేష్టితాశ్లేష మొనరించు
గరిమఁబూనఁగఁ బెడమరులఁబోరలు
ఉదుటుసిబ్బెపుగుబ్బ లొడిసిపట్టఁగఁబోవ
నొదుపుదప్పించు నేర్పొప్పమీఱ
నీవిమాత్రముసంగు నేనన్యమే మొల్ల
నని కేలుచాపఁ దద్వ్యాప్తిమాన్పు
చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రుఁడోడఁ
బ్రథమసురతసమారంభభవ్యకాల
జనితలజ్జాతిశయమునఁ బెనఁగెఁజాలఁ
గన్యకామణి యభిముఖిగాక యిటుల 365

వ॥ అప్పుడు॥ 3

కం॥ తరళగతిఁగాంచుటను బతి
కరమునకుంజిక్కి బాలకఠినకుచ మహా
తరళగతిఁగన్న వారలు
స్థిర నేరికిఁ గఠినులైనఁ జిక్కరె తలఁపన్॥ 3

తే॥ కఠినవక్షోజదుర్గము ల్గ్రామములోనఁ
జేకొనినభూమిపతినింకఁ జెందె(జూవె)
సతతమృదులోరువిస్ఫురదతిమనోహ
రాంగవ్రపాక్రమణవాంఛ యద్భుతముగ॥ 3

అయ్యెడ॥ 3

కం॥ నరపతివాల్గూర్పు పయో
ధరములనుండి చెలి జఘనతలమున ప్రాలెన్
ధరణీధరాగ్రంబులనుం
డిరవొందఁగ ధాత్రీవాలు నింపమరంగన్॥ 37

తే॥ పాణినాథుఁడు తమకంబుపట్టలేక
నీవిబంధంబువిడిచి మానినినితంబ
తలపటం బొయ్య దిగిచి కొ నెలమిఁ బొదలి
యాలరె మిన్నందియున్నట్టు లాత్మలోన॥ 37

మ॥ గురువక్షోజమహాచలేంద్రవిలసత్కూటంబులన్ సత్తప
శ్చరణల్గాని గభీరనాభిసరసిన్ స్నానక్రియల్ సల్పివి
స్ఫురదంచత్కటిభూప్రదక్షిణము నేర్పుల్మీఱఁగావించి శం
బరద్విడ్బ్రహ్మసుఖాప్తిఁగాంచె ధరణీపాలావతంసం బొగిన్॥ 37

సీ॥ రాజసింహము నఖాంకురములు సోఁకకయున్నె
కోమలీ (పృథు) కుచకుంభములను
రాజమత్తేభ సంరంభమెచ్చకయున్నె
నాళీకముఖి నిమ్న నాభిసరసి

రాజమార్తాండ కరస్ఫూర్తిఁ జెడకున్న
బాల కచోత్పలపత్రగరిమ
రాజేంద్రుచేతఁ బారణసేయఁబడకున్న
యంగన మధురాధరామృతంబు
రాజసార్వభౌమ రభస మొందకయున్న
కాంతజఘనతలమహాంతరీప
మును నృపాంగసంగఘనపారవశ్యావ్యాప్తి
యువిద కెఱుకపడక యుండెఁ గాక॥ 373

చ॥ ఖరనఖపంక్తి నిబ్బరపుగబ్బిచనుంగవ గ్రుచ్చిగ్రుచ్చి సుం
దరరదనాంకురంబుల సుధామధురాధరమెల్ల గంట్లుగాఁ
గఱచి భుజాయుగంబునను గాంచనగాత్రము గట్టిపెంచి బా
పురే! నృపుఁ డాఁగెఁ దత్కృతవిమోహమహార్తిసిబద్ధబన్నముల్॥

సీ॥ స్తనితవైభవరీతిఁ దనరారె రత్నకం
కణసాంద్రితరఝుణంఝుణరవంబు
ఘనఘనానీలతఁ గనుపట్టె వరనీల
చంచచ్ఛిరోరుహసంచయంబు
శకశిరాసనోజ్వలతనొప్పె లతాంగి
సీమంతరేఖావిశేషలక్ష్మి
విద్యుల్లతాస్ఫూర్తి వెలసె నన్యోన్యంబు
సంప్రాప్తచారువీక్షణగణంబు
భూరితరవర్షధారావిభూతిఁదనరె
భాసురాంగజఘర్మకబంధరాజి
అహహ! యత్యద్భుతావహంబగుచునపుడు
నీరదాగమమైతోఁచె నిధువనంబు॥ 375

కం॥ ఇత్తెఱఁగుననృపచంద్రుడు। మత్తద్విపయానఁగూడిమన్మధసౌఖ్యా
యత్తవికస్వరభాస్వర। చిత్తాబ్జుండగుచుమిగులఁ జెలఁగుచునుండెన్

ఆ॥ (1) కానఁడేమొ యితఁడు తాను విశ్వబ్రహ్మ
యుపనిషత్తు నచ్చువేసియుంట
కాంచియున్న గోత్రఖండకై బ్రహ్మాండ
పుం బురాణమునకుఁ బోఁడుపోఁడు॥ 294

క॥ (2) అది ముద్రితమయియో యు
న్నదియంచ నేఁగాని యందుసందా సని
ట్టిది కలదో లేదో చూడం
డదిచదివెడి తెలివిలేని యాహేతువునన్॥ 295

తే॥ తాము లిఖియించికొనినట్టి తాళపత్ర
ములను దమగోత్రఖండంబు చెలఁగుకతన
నచ్చుపడియున్న యద్దానియందుఁగూడ
నుండెనని యనుకొనేఁగాని యున్నయద్ది॥ 296

మ॥ (3) రావినూతల చీమకుర్తులు రాణనొప్పెడియూళ్లు, భూ
దేవులెందఱో గట్టివాండ్రట చేరియుండిరి, వారె యా
దేవయుం బిలిపించి యీశుప్రతిష్ఠనే సలిపించిరం
టీవిచారవిదూరమానుడి యెట్లునమ్మఁగఁ బోలెడిన్॥ 297

క॥ అద్దంకి గ్రామమంతకుఁ
బెద్దది, యాయూరిలోని పృథ్వీదేవు
లార్ద్దులాకో యీలింగము
విద్దెకె ప్రథమియుంచి యిట్టివిధి కొప్పటకున్॥ 298

(1) మాగోత్రకాండ బ్రహ్మాండపురాణాంతర్గతము-మాబుషు । లహాభూాన త్వష్ట విశ్వరూపులు(కాపు) బ్రహ్మాండపురాణములోఁ జాల నధ్యాయములున్నవి-అది యెవరుచేసినారో నాకు జ్ఞాపకము లేదు-పురాణములు పదునెన్మిది- వానిపేరులుగాని వానిచేసినవాని పేరులుగాని నేను జెప్పలేను-బ్రహ్మాండపురాణముకూడఁ బదునెన్మిదింటిలో నిదేయని నాకు జ్ఞాపకము.

(2) అది యచ్చుపడియున్నది. నేనుగోత్రఖండమునకు మాత్రము సమాచారము చేసినాను-అది తెలుఁగక్షరములలోనున్నది.

(3) రావినూతల చీమకుర్తి యద్దంకులలోను నేను మఱచిపోయిన మఱికొన్ని యూళ్ళలోను మొత్తమున కాఱుగుళ్ళలో బ్రతిష్ఠచేసినాను.

క॥ (1) తా యాజకుఁడుగ నుండిన
యా యాదేవాలయముల నర్చకులును నా
స్త్రీయులు గారఁట, యితరులె
యా యర్చకతం గ్రహించిరంట వినుండీ॥ 299

తే॥ ఎంచిచూడ శివార్చకు ల్పాంచరాత్రు
లలరు మందురు శివకేశ వార్చకులుగ
వారికర్మంబె పగిలెనా? వర్ధకిప్ర
తిష్ఠతార్చ్యల నర్చన త్సేయుటకును॥ 300

క॥ ద్వైతాద్వైతప్రముఖులచేతఁ బ్రతిష్ఠితములైన శిలలె విశిష్టా
ద్వైతులగు పాంచరాత్రులచేతను నర్చింపఁబడవు క్షితి నెందేనిన్

క॥ తామె ప్రతిష్ఠల్సొనరిచి
యేమానవుఁగూడ నంటనీయక పూజ
ల్నేమంబునఁ గావించు న
నామాన్యులు పాంచరాత్రజనములు తలఁపన్॥ 302

తే॥ పాంచరాత్రాగమంబునఁ బరఁగ దాశ్వ
(2) యురయ విష్ణుప్రతిష్ఠల నాచరింపఁ
దగినవారెవ్వరైనది, చూసిలోన
శిల్పి యెందాకనర్హుఁడో చెప్పఁబడియె॥ 303

భుజంగప్రయాతము.

శివబ్రాహ్మణుల్గూడఁ జేయంగఁబోరి
యుమామ్యుల్ప్రతిష్ఠించు నవ్వానిపూజల్

(4) ఈదేవాలయములలో నర్చకులు మానవులముఖాంద్రులు కారు.

(1) విష్ణుతిలకము సప్తమాధ్యాయము, 165 వ పుట

శ్లో॥ యాజమానో గురుం సమ్యగర్చయే దంశురార్చనే। కర్మార్చాదిషు చేతేషు నిర్మితేషు యథావిధి॥ రత్న న్యాసం పీఠికాయాం కారయిత్వాథ శిల్పిభిః। ఉన్మీలయిత్వా నేత్రాణి శిల్పినశ్చ ధనాదిభిః॥ తోషయిత్వా తతో బహిర్మార్గ! ధామ్నాం తర్బహిరబ్జజ! మార్జనాలేపనాద్యైశ్చ శోధయిత్వా సమంతతః॥ ప్రజ్వాలితైర్దర్భపుంజైః పర్యగ్నికరణం చరేత్.

వివాదఙ్ జయంబంద వీక్షించి తానె
యెహోపత్కాసీతం డిటు ల్కల్లమాటల్॥ 304

కం॥ పెదగొట్టిపాటిలో శివుఁ
(1) గుడుగుగనిల్పితినటంచుఁ గూసెసితం డ
య్యాది కేవలమ్మష,సందియు
మొదవినఁ జనువుమురుగాక యుత్తర మవలన్॥ 305

తే॥ ఈదుమూడిననైన రమేట్ప్రతిష్ఠ
యితనియూరనునైన పోలేల్ప్రతిష్ఠ
(2) మానుకొండనునైన యుమామ్ప్రతిష్ఠ
యాదిగాఁగలవన్నియు నట్లె మృషలు॥ 306

కం॥ (3) అందురు బ్రాహ్మణులనియే
యందఱు మమునను మనువు నావాక్యంపున్
జందమె చెప్పెడినీతని
యందంబంతియును, నేల యధికోక్తులతోన్॥ 307

తే॥ (4) అంతకంటెను నాశ్చర్యమైన యింక
నొక్కవాక్యంబుగల దద్దియున్ వినుండు
ఇతఁడు కమసాలియను పేరె యింతవఱకు
తానువిన లేదఁటిది యెంతసూనృతంబొ॥ 308

(2) పెదగొట్టిపాటిలో నేను శివప్రతిష్ఠ చేసినాను. ఈదుమూడిలోను మాగ్రామములోను విష్ణుప్రతిష్ఠ చేసినాను. రావినూతలలోఁగూడ విష్ణుప్రతిష్ఠ చేసినాను. వల్లె వారిపాలెములోను మాగ్రామములోను పోలేరమ్మ ప్రతిష్ఠ చేసినాను.

(1) మానుకొండలో లలితాంబప్రతిష్ఠ చేసినాను. పూనూరులోఁ జింతలమ్మ యంకమ్మల ప్రతిష్ఠలు చేసినాను. పోతారులంకలోఁ బోతరాజు ప్రతిష్ఠ చేసినాను.

(2) మము నెప్పుడును బ్రాహ్మణులనియే పిలుతురు. బజారులోఁ దెలియనివాండ్రు మాత్రము విశ్వబ్రాహ్మణులని పిలుతురు.

(3) నే నిదివఱకు కమసాలియను పేరు వినలేదు. అది యొకవృత్తి పేరు గార్గేయాగమము గార్గేయమహర్షి చేసినాఁడు మయమతాగమము మయవిశ్వకర్మ చేసినాఁడు

ఉ॥ (1) ఆగమమంచు నైకృతిని హాజరుపెట్టెను కోర్టు కద్దితా
బాగుగ నొక్క యూరుభవబాలకుచేత లిఖింపఁజేసెనం
టాగుణవంతుఁ, డందెకల దాత్మగరిష్ఠతయెల్ల నెందుకో
వాఁగెడు బ్రాహ్మణుండనని వ్యర్థముగిం బదిమంది నవ్వఁగన్ ॥309

ఆ॥ (2) అంజనీతనూజు నాలయమ్ముంబని
మేలనంగఁజేయు మేస్త్రికిద్ది
వ్రాసియిడితినంచు వైశ్యుఁ డప్పాత్రంపుఁ
దుదలిఖించె, దానిఁజదువుకొనుఁడు॥ 310

తే॥ తన్ను బ్రాహ్మణుఁడనుటయే తథ్యమైన
శంకరుని దాను నిల్పుటే సత్యమైన
బాగుగఁ బ్రతిష్ఠపల్పిన బ్రాహ్మణునకు
వ్రాసియిచ్చితినని యేల వ్రాయఁడతఁడు॥ 311

ఉ॥ అంత విశేషిమున్నిభు సమాగతుఁడై వచియించె సాక్ష్య, మా
(3) వంతయుఁగాన రాదుభిద యూతిని వాన్యులఁ బెద్దకాఁపు బ

(4) 18వ మార్కు దస్తావేజు (గార్దేయాగమము) ఒక ప్రాతబొక్కునుండి వ్రాయఁబడ్డది 5, 6 సంవత్సరములక్రింద నేనొక కోమటిచేత వ్రాయించినాను కావలె నంటేఁ జినిగిపోయిన ప్రాతతాటాకులపుస్తకముదాఖలుచేతును... తక్కెళ్లపాటి వీరేశలింగాచారి వ్రాలు...

(5) గార్దేయాగమముచివర

ప్రమాదినామసంవత్సర శ్రావణ శు ౧౨ బుధవారంవర్కు గుంటూరుతాలూకా యిలాకా కొలకలూరు గొట్టిపాటిలో శ్రీ ఆంజనేయస్వామివారి దేవాలయంపని పూర్తిగా చేయించిన మేస్త్రీ సంగమోల్ తాలూకాయిలాకా కొప్పెరపాటికాపురస్థుడైన తక్కెళ్లపాటి వీరేశలింగాచార్కు...వ్రాశియివ్వడమైనది.

1911 వ సం॥ 13 వ నవంబరు......ప్రతివాదులతరపు 12 వ సాక్షి...... బొగ్గవరపు వెదయ్య- విశేషిమున్నీభు......జానపాడు.

మా గ్రామములోఁ బాతపాటమ్మ పోతేరమ్మ గుళ్లున్నవి. 40 సం॥ క్రిందఁ జెన్నమల్లను విశ్వబ్రాహ్మణునిచేఁ బ్రతిష్ఠచేయఁబడెను. రెండుగుళ్లలో స్థాపనను మాయన్న కంకణముకట్టుకొనెను. బ్రాహ్మణులు దేవతలకు బోనము పంపరు. చివరప్రతిష్ఠకు 1 వ ప్రతివాదిని పిలిపించినాము. ప్రతిష్ఠయైనతర్వాత బియ్యము పప్పు గుడ్డలు పంచుకొనుటలోఁ గలహముజరిగెను. వాదియు 1 వ ప్రతివాదియు వివాదపడిరి.

ల్వింతగు వాక్కులం, గనుక వేరుగఁ జర్చయొనర్పఁ గాని యొ
క్కింతకుమాత్రి ము త్తరము నిచ్చుచునుంటి బుధు ల్కనుండిక

ఆ॥ కాఱులఱచెనితఁడు గ్రామపౌరోహిత్య
(1) మేను జేయుననియు నా నియోగ
మునను నే రాచేసి కొనివచ్చి యాంపామ్ము
వాకునిత్తురనియు న్యాయ మురివి॥ 3

ఆ॥ ఏనెచేతుఁగాక యితరుఁడేచేయించి
వచ్చు సొమ్ము నాకు నిచ్చుఁగాక
అంత పాపకార్యమనుచుఁ జింతిలఁగాని
మిథ్యవై చిరనుచు మిడుకుచుంటి॥ 31

తే॥ కవిత విద్వత్త యొకయింత ఘనతయొసఁగ
బ్రదుకుచుంటిని నేను మర్యాదతోన
జనులుకొందఱు నింద్యముఁ జేసుచుందలఁచు
గ్రామయాజనమున నుండి కాదు కాదు॥ 31

ఉ॥ పాఱులమీఁది ద్వేషమున బత్తుని నొక్కరుఁ దోడి తెచ్చి పౌ
లేరమకుం బ్రతిష్ఠ సలిపించిన కాఁపులకొంప లేనియుఁ
దూరము చేసి నాపనికిఁ దోడ్పడ కాధ్యపురోధులైనవార్
నేఁడుగనున్న వారు కను వేసుక మాకొటికక్ నిజంబుగన్॥ 31

(క్రాసు) మొదటిప్రతిష్ఠ ధాతసం॥నఁ బూర్వమైయుండును. నాకు బాగుగా జ్ఞాపకములేదు. నా కప్పటి కిరువదిసం॥ల ప్రాయము. అప్పుడుప్రతిష్ఠచేయించినది. జానపాటిగ్రామమునఁడు. అతఁడు మాగ్రామములోఁ బ్రతిష్ఠయేకాని పౌరోహిత్యము చేయఁడు. 2 వప్రతివాది యుపనయనము వివాహము నెవరుచేయించినది నాకుఁదెలియదు. నే నక్కడి కేగలేదు. మాకులమునకు వైదికులు పౌరోహిత్యముచేయుదురు. ఆరాధ్యుఁడుచేసిన మొదటిప్రతిష్ఠ చెడిపోయినందువలన మరల విశ్వబ్రాహ్మణుని బిలువవలసి వచ్చెను వైదిక బ్రాహ్మణులు ప్రతిష్ఠప్పుడేమియు జోక్యముకలిగించుకొనలేదు. మావలె వారుకూడ నక్కడ నేయుండి భాగముకావలెనని కోరినారు. అందుకే మే మాటంకము పరచినాము.

(2) వాది పౌరోహిత్యముచేయుఁడు ఏజంట్లుద్వారమున జరుపును.

చ॥ కనుక నె పెక్కు ధాన్యముల గాదెలునింపఁగ నాలఁ బెంపఁగన్
జనులకునడ్డికిన్ ధనముఁ జాలి మెలంగుచునున్న వారు వాన్
తిన ధరియింప నర్హ పితృదేవబుధాతిథిపూజనల్పనే
యొనరి నగౌరవార్జనము లుంటిని నేను యథోచితంబుగన్॥ 317

ఆ॥ నాదు జీవనంబు కాదు ముహూర్తికి
నార్యులార! గ్రామయాజనంబు
అదియవృత్తిగలుగు నవ్వైదికులకు నే
నచటభాగమడుగు టనవసరము॥ 318

ఉ॥ బత్తుప్రతిష్ఠకొప్పి యట భక్తి సమాప్తినిబొందుదన్క ను
న్మత్తులపోలె నుండిన యమాయికవర్యులు పాలుకోసమై
యెత్తెఱఁగాడుదుర్జగడ, మీనుడి యెవ్విధినమ్మనౌను, ధీ
రోత్తములార! చెప్పుమది యోజనచేసి జవాబొసంగుఁడీ॥ 319

తే॥ ఏమిసంబంధముండెడి నెంచిచూడ
నల ప్రతిష్ఠకు గ్రామాశ్రయంబునకును
అట్లు సంబంధశూన్యమైనట్టిపనిని
భాగమేరీతిఁగోరెడి బ్రాహ్మణాళి॥ 320

తే॥ కడఁగి యెద్దినినన గాటఁగట్టి వేయుఁ
డనెడిధర్మాధికారులైనట్టికతన

---

నాగోమారుఁడు క్రిమినల్కేసులో నొకముద్దయి-ఉన్నముచినవీరయ్య నాపినతల్లి కొడుకు-మేజస్ట్రీటుకేసులో నతఁడుకూడ నొకముద్దయి-మాయూరిలోఁ గరణాలకు బ్రాహ్మణులకుఁ బార్టీలున్నవి-నేను గరణముపక్షమున నున్నాను-నేను వతఁడు స్నేహముగానే యున్నాము-గుండాలము త్తయ్య యనువాఁడు దానిని జెఱిచినకేసులో నే నతనిపక్షమున సాక్షిని-కరణముగూడ సాక్షి-వాదియన్నయు మఱికొందఱు నొకదొంగతనము మఱుఁగుపఱచినట్లుగా నాపై రిపోర్టుచేసినారు నన్ను-సస్పెండుచేసినారు-ఫిర్యాది తన సొమ్మేమియుఁ బోలేదనిచెప్పినది రెండవసారి ప్రతిష్ఠకు యజమానుఁడు లేఁడుకావునఁ గంకణ మెవరును గట్టుకొనలేదు- 2 వ ప్రతివాది ప్రతిష్ఠప్పుడు గ్రామములో లేఁడు-కొమట్లు బోనముతీసికొని పోదురు-బ్రాహ్మణులు మ్రొక్కున్నచో బియ్యము నితర

పన్ని యీమాలికం బెరపార్టివార
లాటలాడంగఁజొచ్చి రన్యాయవృత్తిని॥ 32

క॥ గుండాలము త్తయ్యాఖ్యుఁడు। ఖండించుచు దెంచెవరుసగ సాక్షిగనై
(1) వొండి విమర్శింపఁగఁదగు। దండినుడు గ్గాసరావు తత్సాక్ష్యమునన్।

క॥ మునిసీభు పెద్దకాఁపును। బసిఁగొనిమును పాడినట్టిపాటయె యీతఁ
డును బాడె, కమ్మతెగయె। ల్లను నొక్కటిగాక భిన్నలక్షణమగు॥

ఆ॥ ఎవతో యాడుదంట, యీతఁ డేమో చేసె
నంట, యద్ది కేసు నయ్యెనంట
ఇలు విల్లేజిమున్సి భింతరుము న్నితా
ననియెఁ దనదుసాక్ష్యమునను గనుఁడు॥ 324

క॥ కరణము మున్సిభు పెదకాఁ
పురపడిఁ బ్రేరేప నితఁడు పామ్మనుచుం దా
నరుదెంచి పలికె సాక్ష్యము
గురుతగ పహాయించి కాదు కుకలాదాలపై॥ 325

క॥ తక్కిన వారికిమాత్రము
వెక్కస మొకఁడుండెఁగాని విప్రజనులపై
నక్కమసాలులమీఁదను
నక్కట! గౌరవముగలదె యాలోచింపన్॥ 326

ఉ॥ ఏ మగఁవన్నబాసిఁ గర మీసునఁ గాదనుటే ప్రధాన మా
సాముల, కంతెకాని కమసాలులపైని గురుత్వమున్నదే

వస్తువులు కుమ్మరవానికిత్తురు- నేను విశ్వబ్రాహ్మణులయిండ్లలోఁగాని వైదికులయిండ్ల
లోఁగాని భోజనముచేయను-మాగురువులు వైష్ణవులు- నేను వారియిండ్లలోఁ దినుదును--

(1)...1913 వ సం॥ 13 వ నవంబరు...ప్రతివాదులతరఫు 18 వ సాక్షి...
గుండాల ముత్తయ్య...కమ్మ...జానపాడు

పాతపాటమ్మపోలేరమ్మగుళ్లు నేనెఱుఁగుదును. బ్రాహ్మణులు బోనముతీసి
కొని పోరు. కడపటిప్రతిష్ఠప్పుడు నేనున్నాను, ప్రతిష్ఠయైన తర్వాత బ్రాహ్మణులను
విశ్వబ్రాహ్మణులనుఁ దగవువచ్చెను. కరణము కమ్మవారు విశ్వబ్రాహ్మణులపక్షమున

ఆ మన స్వర్ణకారులకునైనను విప్రులు గౌరవింపరన్
భామమె కాని కాఁపు లెటువల్కిన మానమె భూషణంబగున్ ॥ 327

ఉ॥ మానముఁ బూనకున్న యెడ మాటలతో నిడరుత్తరంబు వార్
గానఁ దదంతికంబునను గౌరవకాంక్ష దొలంగియుండి మా
పైని సవారిచేయుదురు బాపలమేమని, యోయియన్న మా
త్రానను మండిపోదు, రపురా! కమసాలులనంగఁ దిట్టుదుర్ ॥ 328

ఆ॥ ఈప్రతిష్ఠ యైన యిటువెన్క నవ్వారి
యూషు మఱియొకింత యతిశయిల్లె
పదుగురేగువీథిఁ బండి మంచములపై
దిగరు చేవుఁడేగుదేరుఁగాక ॥ 329

క॥ (1) నల్లూరినాగయాఖ్యుం
డుల్లాసముపుట్టి సాక్ష్యమొయ్యనఁ జెప్పన్
మెల్లగ రా నపుడచ్చటి
కెల్లరు కొనియాడిరతని నిక్కమసాలుల్ ॥ 330

---

సహాయముగవచ్చినారు. తగవు బియ్యమునకును గొత్తగుడ్డలకును-వైదికులు బియ్యము గుడ్డలలో భాగముకావలెనన్నారు.

(కాత్రిసు) నేనుగుళ్లవద్దఁబనులుచేయింతును. నేనెఱిఁగినంతవరకు బ్రాహ్మణుడెన్నడును బోనము చెల్లించుటలేదు. కోమట్లప్పుడప్పుడు బోనము తెచ్చుచుందురు. కోమట్లలో నెవరువచ్చినది యెవరురానిది చెప్పఁజాలను. నాకువ్యక్తికలిగినది మొదలు బ్రాహ్మణులు విశ్వబ్రాహ్మణులు బోనము తీసికొనిపోవుచుండుట యెఱుఁగుదును. కరణము తల్లి బోనము తీసికొనిపోవుటయెఱుఁగను. రెండవప్రతివాది ప్రతిష్టప్పడులేఁడు. నామీఁది క్రిమినల్ కేసులోఁ గరణము మునసీఫు నాతరఫుసాక్షులు. వాదియన్ననునాకు స్నేహము.

(1) ...1913 వ సం॥ 13 వ నవంబరు...14 వ సాక్షి...నల్లూరి నాగయ్య...కమ్మ...గారపాడు

వ॥ పరిపూర్ణోదకంబైన హ్రదంబునఁ బిపాసా (నివృత్తి)మాత్రంబు జలగ్రహణంబు సేయునట్లనంతంబులగు వేదంబుల బ్రహ్మనిష్ఠుండప్యాత్మవిజ్ఞానమాత్రం బవలంబించు, దుర్లభంబగుమనుష్యత్వంబుఁ బ్రాపించి యందు బ్రాహ్మణుండయ్యును బటువిగ్రహుండయి సచ్ఛిదానందంబును నద్వయంబును నగు నతివర్ణాశ్రమరూపంబు వేదాంతశ్రవణాదుల నెఱుంగకున్న నింక నెన్నండును ముక్తుండగు, నాకాశంబు చర్మంబునుంబోలెఁ జుట్టివేయ నెప్పుడుసమర్థుండగు నప్పుడు నన్నెఱింగి దుఃఖవిముక్తుండగు, మహాపుణ్యాత్ములకు బహుజన్మాంతంబున మత్ప్రసాదంబువలన మదీయజ్ఞానంబుజనించు, నేదేహంబునన్నైన నపరోక్షజ్ఞానంబు జనించుఁ దద్దేహనాశనపర్యంతంబె సంసారదర్శనంబగుఁగాని తదనంతరంబునం గలుగనేరదు, పరమార్థంబునంజూచినఁ బూర్వంబు(ను సంసారదర్శనము లేదు, దేహవినాశానంతరమునఁ దద్దర్శన మెట్లుసంభవించు) కావున ముక్తిదంబగు బ్రహ్మాత్మవిజ్ఞానంబు మత్ప్రసాదంబునఁ బరమవిగ్రహంబున జనించు,, నని త్రియామయుండును నభీష్టఫలప్రదుండును త్రిలోచనుండును నంబాసహితుండును గృపాకరుండును నగు మహేశ్వరుండు రమేశ్వరునకుఁ బోధించి మౌనముద్రాధరుండయ్యె నంత॥

సీ॥ అఖిలవేదార్థంబు నజ్ఞాత్ముఁ డీలీల
విని శంభు శశిమౌళి విశ్వనాథు
వినుతించి మ్రొక్కి యవ్విభుపాదయుగళంబు
నిజమూర్ధమున నుంచి నియతిఁ దత్ప్ర
సాదంబునను సర్వసంసారపరిజ్ఞుఁ
డయ్యెను, నద్దేవుఁ డబ్జనాభు
సన్నిధి నిగమార్థవరణి యెల్లను దెల్పి
సకలదేవశ్రేష్ఠసహితుఁడగుచుఁ
బుండరీకాఖ్యనగరికిఁబోయి యచటఁ
బుష్టతతులను గణరాజ పూజ సేయుఁ

దా సభాపతియగుచు నృత్యంబుసలిపి
భూరికృపచేత భక్తులఁ బ్రోచుచుండె॥ 130

-: వ్యాఘ్రపురంబున శివుండు దేవతల కుపదేశము సేయుట :-

తే॥ అంత సూతునివీక్షించి యఖిలమునులు
"శివునివల్లను విజ్ఞానసిద్ధిగాంచి
విష్ణుఁ డేలీలవిహరించె విమలచరిత!
చెప్పుమా" యన సూతుండు చెప్పఁదొడఁగె॥ 131

కం॥ హరియుఁ జిదంబరమనఁజను
పురిఁ జేరి మహేశ్వరునకు మ్రొక్కి తదాజ్ఞన్
గరుడారూఢుండయి నిజ
పురమగు వైకుంఠమునకుఁ బోయెను వేడ్కన్॥ 132

ఉ॥ అంత విరించిముఖ్యదివిజాధిపు లాహరి లోకనాయకున్
శాంతు ధరారమాపతిని జక్రి గదాసిమహాబ్జహస్తు న
త్యంతదయాఢ్యు భక్తివినయంబున మ్రొక్కి "మహాత్మ! నీవు న
య్యంతకవైరిచేవినినయర్థము మాకెఱిఁగింపవే" యనన్॥ 133

చ॥ హరి సురకోటికిట్లనియె "నారయ మీరు జగద్ధితైకత
త్పరులయి వేడినప్పటికిఁ దత్త్వరహస్యము నేవచింప, న
గ్గిరిశుఁడె మీకుఁ దెల్పు నిఁకఁ గేవలభక్తిఁ జనందగున్ స్వరా
ట్పురుష హృదబ్జమధ్యగతిఁ బొల్చు చిదంబర దివ్యధామమున్॥ 134

కం॥ ప్రతిదినమును బ్రతిపక్షము
ప్రతిమాసము నాఱునెలలు ప్రతివత్సరమున్
ప్రతినిష్ఠఁ దగిలిచూచిన
యలభక్తున కిచ్చుముక్తి యాస్థల మెప్పుడున్॥ 135

సీ॥ శీఘ్రంబుగా గతశేషదోషమణంచు
భోగకాములకును భోగ మొసఁగు
నమ్మహాతీర్థంబు నతిభక్తిమీరలు
సేవించి తపములు చేసి యచట

నతిసిద్ధిదమును రుద్రాధ్యాయమధ్యస్థ
మును సతారము సర్వమునువరంబు
నగునట్టిపంచాక్షరి గురూక్తి లక్షజ
పము చేసి యభ్రసభాధిపతిని
చూచి కరుణాకటాక్షవిస్ఫురితుఁడైన
యమ్మహాదేవుఁ బంచాక్షరమ్ముచేతఁ
బూజగావింపుఁ డానందపూర్ణుఁడగుచు
మీకు విజ్ఞానమొసఁగు సుశ్లోకులారా! ॥ 136

వ॥ మఱియు నంబికాపతియును నానందమహాతాండవపండితుండును సార్వకాలంబును వటచ్ఛాయానిషణ్ణుండును భూతిభూషణుండును సోమార్ధశేఖరుండును శుద్ధుండును సోమసూర్యాగ్నిలోచనుండును సోముండునుగపర్దియును నీలకంఠుండును వేదయజ్ఞోపవీతియును గంగాధరుండును సుప్రసన్నుండును సుస్మితుండును నురగభూషణుండును దీర్ఘబాహుండును విశాలాక్షుండును వృషారూఢుండును హారకేయూరకటకనూపురాదివిభూషితుండును భస్మధారాధరుండును శ్రీమంతుండును ఫణికుండలమండితుండును బవిత్రపాణియును బుండరీకత్వగంబరుండును గ్వణత్కింకిణీసంయుక్తకలకాంచీవిరాజితుండును సర్వాభరణసంయుక్తుండును సర్వలక్షణలక్షితుండునుగోక్షీరధవళాకారుండునుగుందేందుసదృశప్రభుండును సంసారభయభ్రాంతులకభయేష్టవరప్రదానహస్తద్వయుండును దదన్యకరద్వయసంరూఢ డమరుదీప్తహుతాశనుండును గృపాళుండును నాత్మమాయోత్థ ఘోరాపస్మారపృష్ఠస్థిత పాదాంబుజుండును స్వస్వరూపమహానందప్రకాశప్రచ్యుతుండును నగు శివుండు సర్వవిజ్ఞానంబు మీకుపదేశించు”నని చెప్పి సూతుండు శౌనకాదుల కిట్లనియె॥ 137

తే॥ అఖిలలోకేశ్వరుండైన యంబికేశుఁ
డెచట నానందనృత్యంబు నెసఁగఁ జేయు

వస్త్రహాస్థలిఁ బుండరీకాఖ్యపురముఁ
జేరి రింద్రాదు లాస్తికస్థితి వహించి॥ 138

సీ॥ అంతటఁ దివిజు లత్యంతభక్తివిభూతి
భాసితాకృతులయి భూరినిష్ఠ
వ్రతములు దానంబు లతితపంబులు చేసి
రాదృతి సర్వహితానురక్తి
వేదవేదాంతసంవేద్యపంచాక్షరి
ప్రణవంబుతోడ జపంబు చేసి
భక్తిచే వారు సభాపతిఁ బూజించి
శక్తిసమేతుఁ బ్రసన్నవదను
భుక్తిముక్తిదు స్వాత్మానుభూతిగరిము
లాస్య మొనరించు భక్తకలభ్యు శివుని
జూచి లౌకికవైదికస్తోత్రములను
వినుతిగావించి రానందవివశులగుచు॥ 139

వ॥ అంతనమ్మహాదేవుండు

చ॥ మునులమహోగ్రరాశి సురముఖ్యుల నిర్జరలోకనాథునిన్
గనుఁగొని వారిమ్రోలఁగఁ గరుణించి సమస్తలోకపా
వనమును వేదసారము భవాపహారంబును నైన నృత్తమున్
ఘనముని దేవమధ్యమునఁ గన్గొనఁ జేసె మహేశుఁ డున్నతిన్॥ 141

తే॥ వారు సితాండవదర్శనానందమునను
విబుధు లంత విశేషత వివశులగుచు
నంబికాపతి సర్వజ్ఞ నఖిలనాథు
నాపగాధరు శశిమౌళి నభవుఁ జూచి॥ 142

కం॥ ప్రముఖ్యమున సంసారాంబుధి గ్రక్కునఁ దరియించు ననఘన విజ్ఞానం
బక్కజముగ శ్రుతిహితముగ । మక్కువ బోధింపుమీశ! మాకని వేడన్॥

కం॥ గురువులకు గురువు నొక్కఁడు
పరమేశుఁడు సురలఁ జూచి పలికెను గరుణన్

బును దేవతలలోన నేనును ముఖ్యులగురీతి స్థానంబులలోన మదీయస్థానంబులన్నియు నుత్తమంబు, లందుఁ గాశీ కాళహస్తివృద్ధాచల పుండరీక పుర వల్మీక వేదారణ్యంబు లత్యుత్తమంబు, లం దతిముఖ్యతమంబు కాశీపురం, బంతకంటెఁ బుండరీకపురంబు వా కతిప్రియంబు, మఱియు నమ్మహాస్థలంబు శీఘ్రకాలంబున భుక్తిముక్తిప్రదంబును భక్తిలభ్యంబును నతిశోభనంబును నై ప్రకాశించు, మఱియును. 145

సీ॥ సర్వార్థవిదులైన సంయమీంద్రులచేతఁ
గనఁదగి యాశ్చర్యకలితమైన
విజ్ఞానమిదిమీకు వెసఁజెప్పితిని నేను
సురలార! నమ్మీఁడశ్రుతిపదంబు
నరులచే మునిదేవవరులచే ముక్తికై
సంసేవ్య మిమ్మహాస్థలము భక్తి"
నని దేవదేవుఁ డయ్యభ్రసభాపతి
వేదాంతవేద్యుండు విశ్వసాక్షి
పాశమోచకుఁ డంబికాపతి శివుండు
దెలిపెనీలీల విజ్ఞానదివ్యపదము
నంత దివిజులు బ్రహ్మవిద్యానుభూతి
నభవు వే కాంచి సానందులగుచు భక్తి॥ 146

తే॥ వేదలౌకికనుతులను వేదమయుని
శివు సభాపతి వినుతించి సిద్ధపంచ
వర్ణమంత్రంబుచేత నవార్యనిష్ఠఁ
బూజగావించి రద్భుతస్ఫూర్తి దనర,,॥ 147

• ఈశ్వరసప్తదర్శనము •

వ॥ అని సూతుండు చెప్పిన శౌనకాదిమునులిట్లనిరి 148

తే॥ " సూత! నీచేతవిజ్ఞాన మాతతముగ
సూక్ష్మముగవింటి, మిటమీఁద శూలపాణి

యంబికాపతి బ్రహ్మమైనట్టి శివుని
భూరినర్తనవీక్షించు బుద్ధివొడమె॥ 14

క॥ అటుగనుక కరుణతోడను
పటుగతి నదుపాయమిపుడు భాషింపు " మనన్
" స్ఫుటభక్తి వినుఁడు తెల్పెద
నిటునర్వ " మటంచునూతుఁ డిట్లనిపల్కెన్॥ 150

ఉ॥ " మున్ను వృషాధినాథు మునిముఖ్యుఁడు శౌనకుఁ డిట్లు వేఁడఁగా
సన్నుతకీర్తిఁ నంది శివు సన్నతిఁ మ్రొక్కి వచించె నిట్టుల " ల
భ్యున్నతిఁ దారకాద్రిపయి నొప్పఁగ నాట్యము సేయు సంధ్యలన్
బన్నగ రాజభూషణుఁడు, పార్వతిదక్క నెఱుంగ రెవ్వరున్॥ 151

తే॥ శ్రీమదభ్రసభామధ్యసీమయందు
సలలితానందనృత్తంబుసలుపుశివుని
శౌనకా! నేను గౌరియు షణ్ముఖుండు
గణపతియుఁ దక్క నన్యులు గాంచరెవరు॥ 152

సీ॥ శంభుప్రసాదైకసంసిద్ధిగలవారు
కనుగొందురు తన్నాట్యకౌశలంబు
అట్లాటఁ దత్ప్రసాదార్థమై శౌనక!
పుండరీకాభిఖ్యపురముఁ జేరి
(గ్రహపతి)చాపసంగతమండ నార్ద్రను
గను శుచియై యుషఃకాలమునను
ఘనమైన శివగంగయనుతీర్థమునఁ గ్రుంకి
ధనధాన్యవస్తువు లత్త్వవేది
కిస యథాశక్తినొసఁగి భక్తిని మహేశు
నగనుతేశు మూలస్థాననాథు దండ
వన్నతిప్రదక్షిణములఁ బరఁగఁగొల్చి
యుపవసించి పంచాక్షరాయుతజపంబు॥ 154

వ॥ చేసి యిట్లుదినదినంబును వత్సరాంతంబు సపూర్వవిధానంబుగా స్నానంబుచేసి శ్రీమూలస్థాననాయకునికి నమస్కరించి మహాభక్తి శ్రీమ ద్భ్రభసభాపతికిఁ బ్రదక్షిణాత్రయంబుచేసి దండవన్నతులొనర్చి పూర్వకమంబున శ్రీమత్పంచాక్షరీమంత్రి మయుతంబు జపించి వత్సరాంతంబున యథాశక్తి ధనంబొసంగి శ్రద్ధాపురంబుగాఁ బంచాక్షరంబున సభాపతింబూజించినఁ దత్ప్రసాదంబునఁ దదీయతాండవావలోకనంబగు,నిచ్చట ననేకులు తత్ప్రసాదంబునఁ దన్నృత్తావలోకనంబుచేసి సకలవాంఛితార్థంబులం బడసి”రని చెప్పిన నందీశువాక్యంబులువిని శౌనకుండు శ్రద్ధచేతఁ దత్క్రమంబుగాపించి మహేశ్వప్రసాదంబున న్భ్రభసభామధ్యంబున భవానీసహితుండగుమహేశ్వరు నాట్యంబాలోకించియత్ప్రీతి యథాశక్తిస్తోత్రంబుల స్తుతిసేసి కొంతకాలంబు భక్తిచేతఁ బరవశుండై నాట్యంబు సేయు దేవనాయకునురల నీక్షించి ప్రమోదంబునఁదానును మహాతాండవ ర్తనంబుచేసిన దేవదేవుండును శౌనకునకు సంతుష్టుండై గంభీరవాక్యంబులనిట్లు నియె, “శౌనకా! మదాజ్ఞ మొదలివేదంబగు ఋగ్వేదంబునకు నిర్వాహకుండవుగమ్ము, విశేషించిశౌనకుండును శాకల్యాధ్యయనుండవుగ” మ్మనయానతిచ్చిన శివాజ్ఞావశంబున శౌనకుండును శాకల్యుండనం బ్రసిద్ధుండయ్యె,నిట్లనేకులు పూర్వోక్తమార్గంబున శ్రద్ధాభక్తి న్భ్రభసభామధ్యంబున మహేశ్వరునాట్యంబు విలోకించి యచిరకాలంబునఁ గృతార్థులైరి, కావున మీరును బూర్వోక్తమార్గంబున దేవిచేతఁ జూడంబడు పరుండగునమ్మహేశ్వరునృత్తంబుతత్ప్రసాదమార్గంబునఁనీక్షించి పరముముక్తిం జెందుఁ” డని సూతుండు మహర్షివ్రాతంబున కుపదేశించి మఱియునిట్లనియె!55

సీ॥ “ విష్ణ్వంశజనితుఁడై వివిధగుణాఢ్యుఁడై
గురువరోత్తముఁడౌచుఁ గొమరుమిగులు
వ్యాసుండు మును నాకు నానక్తిఁజెప్పిన
పరమరహస్య మేర్పడఁగమీకుఁ

మన వేదశాస్త్రములు మిక్కిలి బోధించుచున్నవి. "తథాచ శ్రుతయో బహ్వ్యో నిగీతా నిగమేష్వపి, స్వాలక్షణ్యపరీక్షార్థం తాసాం శృణుత నిష్కృతీః" అని 9-అ 19శ్లోకము చెప్పుచున్నది. అనఁగా స్త్రీలు మిక్కిలిగా వ్యభిచార దోషముగలవారని యనేక శ్రుతులందును శాస్త్రములందును జెప్పఁబడియున్నది. అందుకుదృష్టాంతముగా నావ్యభిచారమునకు శ్రుతియందుఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తమును వినుఁడు. ఆశ్రుతి యేదనిన? సమాత్రైకాగ్నికాండమంత్రభాష్యే ద్వితీయప్రపాఠకే యేకోనవింశఃఖండః" "యన్మేమాతా ప్రలులోభచరత్యననువ్రతా తన్మే రేతః పితావృఙ్క్తాంమాభురన్యోవపద్యతే, సుమన్మేస్వాహా" ఇందులకు హరదత్తాచార్యులవారు భాష్యమిట్లు చేసియున్నారు. "యత్ యేతః అన్యదీయం మే మమ మాతా భర్తుః అననువ్రతా అననుకూలా పరతీ చరన్తీ ప్రలులోభ ప్రకర్షేణ యేప(సాధ్వీనామపి మానసవ్యభిచారసంభవా దేవముచ్యతే) రేతః మే మమ పితా వృఙ్క్తాం ఆచ్ఛిద్య స్వీకరోతు మానసవ్యభిచారనిమిత్తం రేతసి సాంకర్యం మాభూత్,, అభవతిత్యాభుః ఏతానతానిమిత్తేన మా మాం ప్రతి పితృత్వేనాభవత్ అన్యః అవపద్యతాం మాభూదోభవతు, యన్మయాదీయమానం హవిః తన్న లభతాం అముష్మై యజ్ఞశర్మణే మహ్యమితి స్వాహా" నాతల్లి భర్తకు ననుకూలవతియై చరించుచు నితరుని రేతస్సును మిక్కిలి యభిలషించినదో(పతివ్రతలకుఁగూడ మానసవ్యభిచారము సంభవించుటవలన నిట్లు చెప్పఁబడినది) యా రేతస్సును నాతండ్రి గ్రహించుఁ గాక. మానసవ్యభిచారనిమిత్తమైన రేతస్సాంకర్యము లేకపోవుఁ గాక. ఈమానసవ్యభిచారనిమిత్తముచేత ననుఁగూర్చి తండ్రిగానైయున్న యితరుఁడు నాచేనీయఁబడుహవిస్సు పొందక వ్యర్థమైనకోరిక గలవాఁడగుఁ గాక. నేనిచ్చుహవిస్సు నాతండ్రికిఁ జెందుఁ గాక "యని పై మంత్రభావము. ఇట్లే" యన్మే పితామహీ ప్రలులోభ, యన్మే ప్రపితామహీ ప్రలులోభ" యనుమంత్రములు పితామహి (తండ్రితల్లి) యొక్కయు, ప్రపితామహి (తాతతల్లి) యొక్కయు మానసవ్యభిచారములను గుఱించి ప్రాయశ్చిత్తవిధానములను జెప్పుచున్నవి. ఈయర్థమునె మనుస్మృతి అధ్యాయము 9 శ్లోకము 20 "యన్మే మాతా ప్రలులుభే విచరంత్యపతివ్రతా, తన్మే రేతః పితావృఙ్క్తా మిత్యస్యైతన్నిదర్శనం" అను దానియందు వ్రాయఁబడియున్నది. అనఁగా నొకఁడు తనతల్లికి మానసవ్యభిచారము సంభవించినటులఁ దెలిసికొని దానికిఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొనుచున్నాఁడు. నాతల్లి పాతివ్రత్యములేక యున్యనియింటికి వెళ్లి యచ్చటఁ బరపురుషునిం జూచి యేదైనను మనస్సుచేత నపేక్షించియుండినదైన నాయాశచేత స్ఖలనమైన రేతస్సును నాతండ్రి తనరేతస్సుచేఁ బరిశుద్ధముఁ జేయుఁ గాక. అని యర్థము. ఈప్రాయశ్చిత్తమామానసవ్యభిచార మొనర్చినట్టి తల్లిగర్భమునఁ దాను బుట్టినందులకై పుత్రుఁడు చేసికొనవలసినదేకాని యామె కొఱకు గాదు.

ఈవిన్నవించినదానింబట్టి స్త్రీల మానసవ్యభిచారమువలన వారియందుఁ గలిగెడి సంతానమునకు నపవిత్రత కలుగునని సూచింపబడినది. ఈమానసవ్యభిచారమునుండి స్త్రీలను రక్షింపవలసినదినములు రజోవతులైయున్న మూడుదినములని తెలియవలయును

నాల్గవదినమున స్నానముచేసి భర్తృసందర్శనము గావించినపిదప నితరపురుషులఁజూచుట వలనవచ్చెడి మానసవ్యభిచారమువలన సంతానమున కేవిధమైన యపవిత్రత కలుగ నేరదని యుఁ దెలియవలెను. దీనింగూర్చి రెండు చిన్నకథలు గలవు. వానిని "సుశ్రుతము రజస్వలావివాహములను బోధించుచున్నదా" యను విషయవిమర్శయందు వ్రాసి యున్నారము. అటఁ జదువుకొందురుగాక. ఈవిమర్శమువలన స్త్రీలను మానసవ్యభిచారమునుండియే రక్షింపవలెనని వేదశాస్త్రములు ఘోషించుచున్నవనియు రక్షించని యెడ సంతానమపవిత్రమగుననియుఁ దేటపడినది. ఇట్లుండఁగాఁ గ్రియావ్యభిచారమునకవకాశ మొసంగెడి రజోదర్శనానంతరస్వయంవరవివాహములవలన నెంతయపవిత్ర సంతానముకలుగునో ప్రాజ్ఞు లూహింతురుగాక.

---

## ఉపసంహారము.

ఓ పూర్వాచారపరాయణులారా!

మనసంఘసంస్కారసోదరులలోఁ గొందఱు తమదేశీయులకు రాజ్యాంగస్వాతంత్ర్యములఁ గొన్నిటి నార్జింపఁగోరి మనదేశమునకేతెంచిన రాజకార్యధురంధరులగు పాశ్చాత్యపండితులసన్నిధినిఁ దమకోరికల నివేదింప వారు మనమేలుఁగోరి మనసోదరులతో "మీలో ననేకజాతిమతశాఖలు గలవు. అవి ద్వేషప్రధానములై యున్నవి. వానింగని యున్న ప్రభుత్వమువారు మీకిప్పుడే రాజ్యాంగస్వాతంత్ర్యముల నొసంగుటకు సమ్మతింపరు. సమ్మతించినను మీలోమీరు కలహించుకొని నశించుటకు మూలమగును గాన సంఘక్షేమమునుగోరెడి మీరు ముందు మీలో నేకజాతీయత నెలకొల్పుకొనుట ప్రథమకర్తవ్యమని బోధింప నేకజాతీయత నెలకొల్పినంగాని రాజ్యాంగస్వాతంత్ర్యములు లభింపవని నమ్మియుండులకై మొదల సర్వవర్ణసమావేశపు విందుల నారగించి యందువలన ఫలము గానక తదుపరి యంతశ్శాఖావివాహముల స్థాపింపఁబోయి విఫలమనోరథులై పిదపఁ బత్రికాగ్రంథముఖముల మనలఁ బరిపరివిధముల దూషింపమొదలిడి యందునను ఫలితము గానక యటుపైఁ జాల యోజించి యన్నివర్ణసాంకర్యములైనను గావించుటకుఁ బురుషులకంటె స్త్రీలు సర్వశక్తులుకలవారనితలంచి వారు మనసంఘమున నస్వతంత్రలైయుండుటచే వారికిస్వాతంత్ర్యము లభించినంగాని వర్ణసాంకర్యముఁ జేయలేరని యెంచి స్త్రీలకా స్వాతంత్ర్యము ర(జోదర్శనా)నంతరస్వయంవర వివాహములవలన గాని చేకూరదని తలపోసి స్వయంవరవివాహములు జనసామాన్య మంగీకరించినంగాని సాగవనియెంచుకొని సామాన్యజనులు శ్రుతి స్మృతి సూత్ర పురాణేతిహాస జ్యోతిశ్శాస్త్ర సుశ్రుతాది మతగ్రంథములం దధికనిష్ఠకలవారగుటచే నాగ్రంథములన్నియు (రజోదర్శనా) నంతర స్వయంవరవివాహములనే బోధించుచున్నవని యుక్త్యాభాసముల నాధారముఁజేసికొని యపార్థములతోడను, విరుద్ధాన్వయములతోడను, గూడినప్రమాణములఁ జేర్చి వ్యాసములు వ్రాసి గ్రంథములు రచించి యున్నారు. ఈవిషయ మీగ్రంథమందు విపులముగాఁ జర్చించి వారివాదములను ఖండించియున్నవారము. మేమేకాక మాకుఁ బూర్వమనేకపండితులు సర్వప్రమాణవాదములతో వీరివాదమును ఖండించుటచేఁ దమ ప్రయత్నము సాగదనియోజించి దండోపాయమునంగాని పూర్వాచారపరాయణులను జక్కఁజేయవలనుగాదనియెంచి యిప్పుడు "రజస్వలావివాహశాసనమును" గోరియున్నారు వారికోరిక నెరవేరనేని మనసంఘము నిర్మూలమగునని యిందు శాసన యుక్త్యనుభవ

హేతువాదవిమర్శనములందు నిరూపించియున్నారము. కావున దీనిం దిలకించి పూర్వాచారపరాయణులందఱును నొండొరుల నుద్బోధించుకొని యీమహాపదను బాపుకొందురని నమ్మియున్నారము ఇంతయేల? మన మార్యమహర్షుల సంతతివారమై వారిరక్తవము శరీరగరక్తనాళముల నేసూత్రమునం బ్రవహించుచున్నయెడలను వారికీర్తి దిగంవిశ్రాంతమై మనకు గణనీయమైనదగు నెడలను త్రికరణశుద్ధిగా మనభావికాలసంఘసరక్షణమును మనలక్ష్యమునందుం బెట్టుకొనియున్న యెడలను, మనసంఘసంస్కాసోదరులిపుడు చేసెడి శ్రుతి స్మృతి సూత్ర పురాణేతిహాస జ్యోతిశ్శాస్త్ర సుశ్రుయుక్త్యనుభవ హేతు చరిత్రాదులకు విరుద్ధములైన యుపదేశములను, బొందియనాచారములను గ్రహింపక యుండుముగాత పరమేశ్వరుండీ సనాతనధర్మాభిమానమును మనయందాచంద్రతారార్కముగా నిలుపుఁగాత సకలజనులును విశ్వజనీనమగుసుఖము ననుభవింతురుగాత! ధర్మమే పక్షమునకున్న నాపక్షము జయించుఁగాత సత్యమే జయించుఁగాక అసత్యము జయింపకుండుఁగాక ఓ సంఘసంస్కారప్రియసోదరులారా!

మీవాదములన్నియు నిందు బహ్వర్థములుగా ఖండింపఁబడినవి. మీరు మమ్ము నేఁ పరుషవాక్యములతో దూషించియుండుటచే మీవాదములు పడిపోయినపు డావిషయమును జనసామాన్యము గ్రహింపవలెనని యెంచి యొకానొకస్థలములయందుఁ గొన్నిపరిహసోక్తులను సామాన్యపరుషవాక్యములను విధిలేక ప్రయోగించియున్నారము. వానిఁ గూర్చి మీరేట్లు తలంచినను మేము చేయునదేమియులేదు. మేము విమర్శించిచూడఁగ మీబోధలను వినినయెడలనే మీరుచెప్పినట్లు నీతిలేనిశుంఠలమును, ద్విపాదపశువులమును, నగుదుమని బాగుగఁ దోఁచుటచే వర్ణసాంకర్యకారక రజోదర్శనానంతరస్వయంవరవివాహాది సంస్కారములను మాసంఘపురపరిసరమునకుఁగూడఁ జేరనీయుమని యీగ్రంథముఖమున విన్నవించుచు నీగ్రంథసమాప్తిని గావించుచున్నారము.

సనాతనధర్మో విజయతే తరాం

క॥ ధర్మంబుఁ జెఱుపఁ జెఱుచును
ధర్మమురక్షించువానిఁ దారక్షించున్
ధర్మంబు చెడకయుండను
నిర్మలమతిఁ బోవవలయు నిశ్చలనియతిన్॥

(భారతము)

ఇది శివపురపు వీరభద్రపాకయాజి,
చివుకులఅప్పయ్యశాస్త్రిప్రణీత
రజస్వలావివాహఖండనము.

శ్రీ శ్రీ శ్రీ

# * తప్పొప్పుల పట్టిక. *

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 1 | తెలుము | తెలుపును |
| 12 | 18 | పండిత | పండితు |
| 21 | 22 | హరోత్రుడు | హరోత్రుడు |
| 22 | 19 | నటు | నట్లు |
| | 21 | అప్పుడి | అప్పుడీ |
| 23 | 5 | వాకాన | వారుకాన |
| | 6 | పృష | పృష్ఠ |
| 24 | 26 | స్త్రీలు | స్త్రీలు |
| | 28 | తెలుచున్నది | తెలుచున్నది |
| 25 | 11 | సంకర్భలగు | సందర్భములగు |
| | 13 | ఊర్ధ్వతు | ఊర్ధ్వంతు |
| | 18 | శోకము | శ్లోకము |
| | | ఉత్కృష్టాభి | ఉత్కృష్టాయాభి |
| | 23 | న్యచవానాం | న్యైవేనాం |
| 26 | 28 | వరి | వరిం |
| 27 | 1 | వార్షకం | వార్షికం |
| | 12 | బ్రాహ్మణ | బ్రాహ్మ |
| 29 | 8 | తిషం | తిష్ఠం |
| | 17 | సంశయాం | సంశయః |
| 30 | 1 | వర్ణాశ్ర | వర్ణాఖ్య |
| | | శ్లోక | శ్లోక |
| | 10 | హాత్మ్య | హాత్మ్య |
| | 11 | వార్షకం | వార్షికం |
| | 26 | తద్ధాతుః | తద్దాతుః |
| | 27 | గోహిణి | గోహిణీ |
| | 28 | జేసిన | చేసిన |
| 31 | 2 | మగువటలన | మగుటవలన |
| | 4 | సదద్బ్రిహ్మ | దదర్బ్రహ్మ |

| | | | |
|---|---|---|---|
| | 15 | శ్లోకము | శ్లోకము |
| | 18 | సముద్వాహో | సముద్వాహో |
| | | పాంక్తేయ | పాంక్తేయ |
| | 21 | చెసి | చేసి |
| | 29 | ఉద్వాహోద్యనుతాం | ఉద్వాహోద్యన్నుతా |
| 32 | 15 | శాతాతళ | శాతాతప |
| | 14 | శ్లోకము | శ్లోకము |
| | | శసంస్కృతా | సంస్కృతా |
| 33 | 4 | బ్రహ్మ | బ్రాహ్మ |
| 35 | 9 | కానున్నను | గానున్నను |
| | 10 | మైదునాంగ | మైథునాంగ |
| | 18 | సకామున్లై | సకాముల్లై |
| | 21 | జేసికొని | చేసికొని |
| 36 | 12 | దచ్ఛయ్యాను | దచ్ఛయ్యాను |
| | 18 | మొహాం | మోహాం |
| | 28 | జేసుకొని | చేసికొని |
| 38 | 23 | గర్భదాన | గర్భధాన |
| 39 | 24 | యాదేయం | యాదీయం |
| 40 | 14 | త్కారగాత్ | త్కారణాత్ |
| 43 | 32 | జేయ | ధ్యేయ |
| 48 | 26 | నిఫు | నిఫ్ఢు |
| | 28 | వలద | వలదని |
| 53 | 11 | పత్ని | పత్నీ |
| 55 | 8 | యిలాలు | యిల్లాలు |
| 60 | 7 | మకార్చుట | మార్చుట |
| | 16 | మారి | మాటి |
| | 17 | డికాల | డీకాల |
| 61 | 17 | బొంద | బొందు |
| | 26 | అష్టవా | అష్టవర్షా |
| 63 | 24 | బాల్యవివాహములను మతికొన్ని జాతులయం దు బాల్యవివాహములు నురజోదర్శ | రజోదర్శ |

| | | | |
|---|---|---|---|
| | 29 | వ్యవహారకములుగును | వ్యవహారముకలుగును |
| 64 | 5 | భోగా | భోగే |
| | 6 | గృహీతాం | గృహీతాం |
| | 8 | బుధ | బుద్ధి |
| | 10 | అన్యపూర్వికా | అన్యపూర్విక |
| 69 | 1 | స్త్రీల | స్త్రీల |
| 78 | 26 | నిహితము | విహితము |
| | 28 | పమాణం | ప్రమాణం |
| 79 | 11 | త్స్వల్ప | త్యల్ప |
| 80 | 5 | దరశ్రీయములని | ధరశ్రీయములని |
| 82 | 16 | స్థాపింపఁలఁచి | స్థాపింపఁదలఁచి |
| 93 | 9 | హిందు | హిందూ |
| | | గీర్తిని | కీర్తిని |
| 98 | 10 | యును | మను |
| | 13 | క్రూర్యత్వముల | క్రూరత్వముల |
| | | స్త్రీలకవిధ | స్త్రీలకేవిధ |
| | 14 | స్వాతంత్రియము | స్వాతంత్ర్యము |
| | 28 | స్వాతంత్ర | స్వాతంత్ర్య |
| 99 | 19 | చెప్పుకొనక | యొప్పుకొనక |
| 101 | 18 | స్వతాంత్ర్యధికారము | స్వతాంత్వధికారము |
| 102 | 9 | దేశమా | దేశమాత |
| 104 | 4 | బాలురుదము | బాలురుదయిం |
| | | యింట | చుట |
| | 7 | గర్భదాన | గర్భధాన |
| | 10 | (జోదర్య నా) | ర(జోదర్య నా) |
| 111 | 11 | అత్యుత్త | అత్యున్నత |
| 116 | 11 | గృహస్తుఁడై | గృహాస్థుఁడై |
| | 9 | యుంటయొ | యుంటనో |
| 120 | 7 | దేశముపై | దేశముపై |
| | 14 | లచంత | లచలిత |
| | 26 | పైసాచ | పైశాచ |
| 121 | 12 | ధితా్వ | ధితా్వ |

# పీఠిక.

రజస్వలావివాహశాసనపుగడబిడ యారంభమైనదాన బహుజనులు పలువురమంది బిల్లు, ఏరీతి, ప్యాసుకాకుండునాయని యోజించి తమయనంగీకారపత్రికలఁ బ్రభుత్వమువారికిఁ బంపుకొనుచుండుటయుఁ బెక్కండ్రు పండితులు రజస్వలావివాహఖండనవాదములం బ్రచురింపఁగడంగిరి. అట్టియెడ నీవిషయమై విపులమైన గ్రంథమే యొక్కటి వ్రాసి బ్రాహ్మణులు ప్రభువులయనుగ్రహమునకుఁ బాత్రులగుటయును నైనను గాకున్నను నేతద్దురాచారగ్రహావిష్టులు కాకుండుటయును యోజింపుమండని మిత్రులగు ప్రకృతగ్రంథకర్తలు తాము వ్రాసియుంచితిమనియు దానిఁ దమమిత్రులింకెవరో ప్రచురింపుమండిరనియు నాతోనుడివిరి. అపుడు నేను పత్రికాముఖమునఁ బ్రకటితమైన బహుదేశముల విదితమగునని బోధించి వివిధకార్యవ్యాసక్తుఁడనగుట వేఱుగ వ్రాయఁజాలక యీగ్రంథమే కైకొని నాపత్రికయందు వత్సరార్ధమునుండి వరుసగాఁ బ్రకటించితి. గ్రంథకర్త లీగ్రంథలేఖనమునకుఁ దగినంత సామగ్రిని జక్కఁగా సంపాదించి యసంస్కారులగు సంఘసంస్కారులవాదములను ముక్కలుముక్కలుగ ఖండించియున్నారు. విపక్షులవ్రాఁతలను వివిధయుక్త్యనుభవహేతుచరిత్రలచే నామావశిష్టములుగఁ జేయుటట్లుండ శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాససూత్రాదుల ననేకము లుపయోగించి భాష్యానుసారములైన తదర్థములను విపులముగా విలిఖించియున్నారు. నవనాగరికులు శాస్త్రజ్ఞులకును దురవగాహములగు శ్రుతిసూత్రాదుల నెత్తికొని తమ మిడిమిడిజ్ఞానముచేఁ దమయభిప్రాయముల కనుకూలముగ నేమేమొ యవకతవకవ్రాఁతలు వ్రాసి తమబోంట్లచేతనే నడపఁబడు పత్రికలలోఁ బ్రచురించినవిషయములన్నియు బహుశ్రద్ధతో సంపాదించి వానినన్నిటిని ఖండఖండములు గావించిరి. సనాతనధర్మానుయాయులైనపండితుల ననేకుల నోటికివచ్చినట్లెల్లఁ దిట్టివ్రాసిన సంఘసంస్కారివారు ఈగ్రంథముం గాంచి నోటికిఁ దాళమువేసికొనవచ్చును. శాస్త్రజటిలములు గాక సామాన్యులకుఁగూడఁ దెలియఁదగిన సులభశైలిలో శ్రుతిస్మృతిసూత్రాదులం జాలఁ జర్చించి వ్రాయఁబడిన యీగ్రంథము సంఘసంస్కర్తృనామకములైన లోకోద్ధారంమన్యపర్వతములపాలిఁటికి వజ్రాయుధమువంటిది. ఈరజస్వలావివాహవిషయమై యింతవఱకు శాస్త్రజటిలములై శాస్త్రజ్ఞులకు హృదయంగమములైనగ్రంథము లున్నను నిట్టి యాబాలవృద్ధముఁ దెలియఁదగినది పుట్టియుండలేదు. ఇట్టి వర్ణసంకరకారకములైన తర్కవాదము లన్నింటిమీఁదను నొక్కొక్కగ్రంథము వ్రాయ బద్ధకంకణులైన యీగ్రంథకర్తలఁ బరమేశ్వరుఁడు పరిపూర్ణాయురారోగ్యములనిచ్చి పరిపాలించుఁగాక. ఇందలియచ్చుతప్పులఁ గొంతవఱకు పట్టికలో వివరించినను మఱికొన్నియుండక తీరినదికాదు. లేఖకప్రమాదమువలనఁ బొడమిన రజస్వలానంతరవివాహ గౌరవనీయాదులును ముద్రాపకప్రమాదమువలన లోపించిన శకటరేఫలు నరసున్నలు పొట్టలోనిసున్నలు పొల్లులు మున్నగు స్వల్పదోషములఁ జదువరులే సవరించుకొందురు గాక.

జానపాటి పట్టాభిరామశాస్త్రి
అభినవసరస్వతి పత్రికాధిపతి.

# విషయసూచిక.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

2 రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

## సహాయులు.

17 సాకుంట శంకరరావు దేశపాండ్యాగారు-జగిత్యాల.

18 పట్టివర్ధనం సీతారామరావుగారు-వకీల్-కంభంమెట్టు.

19 మల్లాది కామయ్యగారు, చింతపల్లివారసానిసంస్థానం గుంటూరు,

20 శివపురపు వీరభద్రపాకయాజిగారు,సికిందాబాదా

21 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీల్ దారు-జగిత్యాల.

## ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 కొప్పరాజా గురుచంద్రశేఖరరావుగారు, ఫారెష్టు గార్డు,కండ్లగుంట.

2 కొతంరాజా సూర్యనారాయణగారు, తుమురుగోడురు.

3 పుచ్చా సీతారామశర్మగారు, పెదకొండూరు,

4 కలువలపల్లి గంగయ్య, శాస్త్రిగారు, భాస్కరపంతులు, ఏలూరు.

5 వెంకటగమణ నివాసలైబ్రరి, తిరుపతి.

6 రాజశేఖరుని రామకృష్ణయ్యగారు, బ్రాహ్మణపల్లె.

7 ముదిగొండ వీరమల్లావధానిగారు, నందిగామ.

8 అక్కిరాజా లక్ష్మీనారాయణగారు, కరణం, గుత్తికొండ,

9 మూదిగొండ బసవయ్యగారు,ముక్త్యాల.

10 లంక సుందరరామశాస్త్రిగారు, అంబాపురం.

11 శ్రీగిరిరాజా రాఘవయ్యగారు, గుండ్లపల్లి.

12 కంభం నాగేశ్వరరావుగారు, పోలీసుసబ్ యినస్పెక్టరు, బొమ్మరాజాపల్లె

13 గుంటుపల్లి పేరయ్యగారు, కరణం, చెన్నుపల్లె.

14 ఆకెళ్ల శేషశాస్త్రిగారు, కుంకలగుంట.

15 కొట్టిపాటి వెంకటలక్ష్మీనారాయణగారు, ఏలూరు.

16 వెల్లాల సదాశివశాస్త్రిగారు, కొలాపురము.

17 మంచికంటి వెంకటరామయ్యగారు , కంట్రాక్టరు, గుడిపాడు.

18 ఉప్పలపాటి వెంకటసుబ్బయ్యగారు, ఉప్పలపాడు.

19 మైలవరపు వెంకటప్పయ్యగారు, చిలకలూరుపేట.

20 రాచకొండ శివన్నసోమయాజులుగారు, చముర్లమూడి.

21 రాచకొండ ఆంజనేయులుగారు, విలేజిమున్సిఫ్, చముళ్ళమూడి.

# అభినవసరస్వతి

---

పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి

ఇదియొక మాసపత్రిక-ఇందుఁ బ్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును, ప్రకటింపఁబడును. ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములకాలవాలంబగు నానందమునాఁకఁ జందాదారులకు సం॥ కు 2-3 అపూర్వగ్రంథము లలవడును. చందా సం॥ 1కి, రు 2-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అళ్వయాచార్యవిజయము | ... | ... | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి పూ( శివీరభద్రకవి) | ... | ... | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } ఇవి రెండు నాటకములు | ... | ... | 0-4-0 |
| 4 | కంసవధము | | ... | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి ( సింహాద్రి వెంకటాచార్యులు) | | ... | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | ... | 0-2-0 |
| 7 | నీతిగీతులు ( సుమతి శతకమునకు సంస్కృతము ) | | ... | 0-[illegible]-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | ... | 0-2-0 |
| 9 | విగ్రహారాధనఖండనఖండనము | ... | ... | 0-4-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము ( పత్రికాధిపతి ) | | ... | 0-4-0 |
| 11 | సంగదోషము | ... | ... | 0-8-0 |
| 12 | వీరభాగవతము ( ముదిగొండ వీరభద్రకవి ) | ... | ... | 1-4-0 |
| 13 | పుళిందావివాహము ( పత్రికాధిపతి ) | ... | ... | 0-4-0 |
| 14 | గుఱిగింజ,వత్సలనీతిశతకము,వ్యాసనిష్కాసనము,పిష్టపేషణము | | ... | 0-4-0 |
| 15 | శివానందలహరి ( తంగెడ రామకృష్ణకవి ) | ... | ... | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము ( రాయసము వెంకటపతి ) | ... | ... | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము ( తిరుపతి వేంకటీయము ) | | ... | 0-8-0 |
| 18 | పశ్యాంపుశ్యాం ,, | ... | ... | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, | ... | ... | 0-2-0 |
| 20 | పురశ్చరణము ,, | ... | ... | 0-2-0 |
| 21 | అత్యద్భుతవిమర్శనము, (ఇది వెంకటరామకృష్ణకవుల అవధానముల పైవిమర్శనం) | ... | ... | 0-5-0 |

అభినవసరస్వతీ కార్యస్థానము

జానపాడు-పిడుగురాళ్ళపోష్టు, గుంటూరు జిల్లా.